Registered No. M-4345.

# యుద్ధ సంచిక.

వాల్యుం I.] మద్రాసు : 1941 వ సం॥ అక్టోబరు నెల 10 వ తేది శుక్రవారం [నె 30 రు

## హిట్లరు ఎత్తులకు సోవియటు ప్రభుత్వ ప్రతిక్రియ:

### యూరలు ప్రాంతములందు రష్యా పరిశ్రమలు.

హిట్లరు యీ వారం తన ఉపన్యాసంలో చెప్పిన ప్రకారం రష్యాలో ఉత్తరమున లెనిన్‌గ్రాడు నగరంనుండి దక్షిణమున క్రిమియావరకు 1,200 మైళ్ల మేర జర్మనుల తీవ్ర దాడి కొనసాగుచున్నట్లు వార్తలు వస్తున్నాయి. అందు ముఖ్యమయినదాడి మధ్యరంగమున రాజధాని నగరమగు మాస్కోపై దక్షిణమునుండి కూడా జరుగుచున్నది. ఉత్తరం నుండి స్మాలెంస్కు నగరం చేరిన జర్మనులపై దాడిచేయుచున్న రష్యను సైన్యాలకు వెనుకగ జర్మనులు ఉత్తరం వైపు నుండి వచ్చి ప్రతి దాడి చేయుచున్నారు. స్మాలెంస్కు నగరం దక్షిణమునుండి వేరొక జర్మను సైనికదళం ఉత్తరానికి దాడి నెడలుచున్నది. జర్మనులు మాస్కో నగరాన్ని చుట్టివేయాలని చూస్తున్నారు. ఈ రంగంలో సైన్యాలకు అధికబలం చేకూర్చుటకే మధ్యరంగంలో తీవ్రత తగ్గించిరి. మాస్కో, లెనిన్‌గ్రాడులను పూర్తిగ ఆక్రమించలేకున్నా ఉత్తర మధ్యరంగములందు శత్రువుల ఆటకట్టు చేయించి, తన సేనలను దక్షిణమున ఫలప్రదమగు ప్రాంతాల పైకి మరల్చుటకు వీలుకలుగ చేసుకోవాలని హిట్లరు ఆదుర్ద పడుచున్నాడు.

కాని మధ్యరంగమున మార్షలు టిమొషంకో నాయకత్వమునను, ఉత్తరరంగమున మార్షలు వారాషిలాపు నాయకత్వమునను రష్యను సేనలు జర్మనులదాడిని బాగుగ నిరోధించుచున్నారు. వారిదే పైచేయిగా నున్నది. ఫిన్లాండు తీరాన రష్యా సేనలను దించుటకు గూడ ప్రయత్నించెను. దక్షిణభాగమున ఒడెస్సానగరం యింకా శత్రుదాడిని నిరోధించుచునే యున్నది. అచట ఇంతవరకు రష్యనులు 96,000 చచ్చుటో గాయపడుటో జరిగెను.

క్రిమియా ద్వీపకల్పానికి ద్వారంవలెనున్న పెరికోపు భూసంధివద్ద, రష్యనుల సైనిక శిబిరాలకు వెనకాతల జర్మనులు విమానదాడులు జరుపుచున్నప్పటికి రష్యా రక్షణశ్రేణిని భేదించదలేకున్నవి. అయినా, దాని ప్రక్కనేవున్న అజోవుసముద్రతీరమున జర్మను సేనలు దిగినవి. ఇది అటు క్రిమియాకును, యిటు కాకసను చమురు గనులకుగూడ ప్రమాదమే.

క్రిమియాను జర్మనులు చేరుటకు పెరికోపు మార్గమేకాక, వేరొక రైలువంతెన, సన్ననికాల్వ మార్గములుగూడ కలవు. పెరికోపునకు వాయువ్యదిక్కున నిపరు నదీతీరాన్న 70 మైళ్ల దూరంలోనున్న కెర్సనుపురము యింకా రష్యనుల వశమందేయుంది. ఒడెస్సా, లెనిన్‌గ్రాడు నగరాల చుట్టుడినిబట్టి చూచినచో రష్యనుల రక్షణ యేర్పాటులు చాల సమర్థమయినవని చెప్పవచ్చును. ఖార్కోవువైపు జర్మనులు దాడి సాగించుచున్నారు. కాని పాలటోవునగరాన్ని గోల్పోయినా రష్యనులు ఎంతదెబ్బతింటున్నారో అంతకు ఇబ్బడిగా దెబ్బ తీస్తున్నారు. కీవు ప్రాంతములందు రష్యనులు 30 గ్రామాలనుపైగా తిరిగి శత్రువులనుండి వశపరచుకొనిరి. వేరొకచోట 36 గంటలలో 20 మైళ్లదూరం చొచ్చుకపోయిరి.

### యూరల్ ప్రాంతంలో పరిశ్రమలు.

బ్రిటనుపై బడుటకు ముందుగ రష్యాయొక్క సైనికశక్తిని అణచివేసి, రష్యాలోని వ్యవసాయ పరిశ్రమల సంపదనంతా తీసుకోవాలని హిట్లరుయొక్క ముఖ్యోద్దేశం. అతని సైన్యాలు ఉక్రైను, క్రిమియా ద్వీపకల్పాలను ఆక్రమించాయని వాదంకొరకు అంగీకరించినా, పైనదెలిపిన అతని ఉద్దేశం నెరవేరదు. ఇప్పటివరకు జర్మను సైనికులు 30 లక్షలకు పైగా చనిపోవుటో గాయపడుటో జరిగెను; 11,000 టాంకులు, 13,000 ఫిరంగులు, 9,000 విమానాలను జర్మనులు గోల్పోయిరి. రష్యా సైనికులు 230,000 చనిపోయిరి, 720,000 మంది గాయపడిరి, 178,000 కనబడలేదు, 8900 ఫిరంగులు, 7,000 టాంకులు, 5,316 విమానాలు మాత్రం పోయినవి. ఇంతైనా హిట్లరు కార్యం నెరవేరదు.

యూరోపులో ఆక్రమించిన దేశాలలో శిరి సంపదలు కొల్లగొట్టినట్లు, రష్యాలోని బొగ్గు, చమురు, గోధుమల సంపదంతా హిట్లరుకు సులభంగా చిక్కునని చాలమంది అనుకుంటున్నారు. కాని రష్యా సంపదంతా ఒక్కచోటనే యుందా? నేటి రష్యాలో లాభకరమగు పరిశ్రమలన్ని యింకోచోటనున్నాయి. రష్యాపూర్తిగ ఉక్రైను, కాకసను ప్రాంతాలపైనే ఆధారపడియుండలేదు. రష్యా అంతర్యుద్ధం జరిగినపుడు (1918-20) ఉక్రైను, కాకసను ప్రాంతాలు వైటురష్యా సైన్యాలచేతులలోనుండి జారిపోయెను. అయినా సోవియటు ప్రభుత్వం తన సేనకు కావలసిన ఆయుధపరికారాలు, పరిశ్రమ వస్తువులన్ని గూడ మాస్కో ప్రాంతాలనుండి యూరలు పర్వత ప్రాంతాలనుండి తెప్పించి యివ్వగల్గెను. ఉత్తరాన లెనిన్‌గ్రాడు ప్రాంతాలందు లోహపు కర్మాగారాలు, వస్త్రపు మిల్లులు, నౌకా నిర్మాణ శాలలు, ఎంతకాలంనుండో గలవు. మాస్కోలోను దాని చేరువను నేత పరిశ్రమలు, చిన్న ఇంజనీరింగు పరిశ్రమలు గలవు. ఉక్రైను రాష్ట్రమునందు చాల పెద్ద పరిశ్రమలు, ఎలక్ట్రికు ఇనుము, బొగ్గు పరిశ్రమలు ఎక్కువగా నుండేవి కాని ఇరువదేండ్ల క్రిందట యూరోపులో రాజకీయ పరిస్థితులు తారుమారగుట, జర్మనీ ఆయుధాలు పెంచుట ద్వార ప్రాచ్యం జపాను ప్రాంతములందు అలజడి యిదంతా గమనించిన రష్యానాయకులకు తమ పరిశ్రమలన్ని పడమటి సరిహద్దుచేరువగా ఒకేచోటనుండి పోవుట ప్రమాదమని తెలిసెను. దూరప్రాచ్యమున యుద్ధం జరిగినచో యీ పడమర సరిహద్దు చేరువనుండి 5,000 మైళ్ల దూరంవరకు ఆయుధ సామగ్రి సప్లయిలు అందుట కష్టం. అందుచేత పడమటి యూరోపు దేశాల ముఖ్యంగా జర్మనీనుండి దూరంగా నుండేటట్లు క్రొత్త చోట్లలలో పరిశ్రమల కేంద్రాలను ఏర్పరచిరి, ఆయుధోత్పత్తి అక్కడనే జరుపుచున్నారు. ఆ ప్రాంతం వోల్గా నదికి యూరలు పర్వతాలకు మధ్యగాగలదు. దాని దక్షిణ భాగములో చమురుగనులు ఎక్కువగనున్నందున ఆ ప్రాంతానికి

“ పెంటవ కాలం ” అన్న పేరుకూడా కలదు. పడమటి సైబీరియాయందు, మధ్యఆసియాయందు రష్యను తూర్పుకొన నూతన పరిశ్రమలు ఏర్పరచిరి.

జర్మనీ రష్యనులు ఉక్రైను డొనెట్సులోయలను గెల్చియున్నచో వారి పరిశ్రమలకు భంగం కలుగుననుకోరాదు. ఈలోగా వారికి అమెరికా బ్రిటనుల సహాయం అందగలదు. లెనిన్‌గ్రాడు, మాస్కోలు, సోవియటు ప్రభుత్వం వశమందే కొంతకాలంయింకా ఉండి వారి సేనలు డాన్ వరకు మాత్రమే మరలి పోవలసియుంటే వారికి పెట్రోలు, క్రోము, రాగి, సీసం, తుత్తునాగం సప్లయి ఏమి తగ్గిపోదు. ఉక్కు, ఇనుము, రసాయన ద్రవ్యాలుకూడ నూటికి 35 నుండి 65 వంతున యింకను మిగిలియుండును. డానుదాటి వోల్గానది వరకు వెడలిపోవలసి వచ్చినచో యీ సప్లైయిలు కొద్దిగ తగ్గిపోవును. పెట్రోలు 100 నుండి 85 వరకు తగ్గును. అల్యూమినియం నూటికి 8 వంతులు తగ్గును. కాని రష్యా విమానాలు తయారుచేసుకొనుటకు చాలని అల్యూమినియం తాము పంపుటకు ఏర్పాటులు చేసితిమని అమెరికా బ్రిటనులు అభయమిచ్చినవి. యూరలు పర్వత ప్రాంతములందే రష్యా ముడిపదార్థాల సంపద మొత్తంలో నాల్గోవంతుగలదు. అందుకే యిటీవల అచట అయుధ పరిశ్రమలన్ని స్థాపించిరి. ఆదేశంయొక్క ప్రధాన ఉక్కు యినుప పరిశ్రమ రసాయన కర్మాగారము, యంత్ర నిర్మాణశాల, రాగి కరిగించే ఫాక్టరీ, మోటారు నిర్మాణ యంత్రాలు అన్ని అక్కడకలవు. అక్కడ బొగ్గు తక్కువైతే ఎలక్ట్రికు శక్తి కేంద్రములతో పనిచేయించుచున్నారు. ఇవి రష్యా పడమర సరిహద్దులకు 1,500 నుండి 2,000 మైళ్ళ దూరంగాను తూర్పు సరిహద్దులకు యింకా దూరంగాను ఉన్నాయి.

ఈ ప్రాంతం పరిశ్రమలు యింత అభివృద్ధిచెందినా, మంచి శ్రేష్టమయిన ఉక్కునకు యంత్రాలకు ప్రాత పరిశ్రమ కేంద్రాలగు లెనిన్‌గ్రాడు, మాస్కోలపైనవే ఎక్కువగ ఆధారపడియున్నవి. అందుచే అక్కడనుండి ఆ సరకు రాజాలని సమయాన ఇరానుగుండా బ్రిటను, అమెరికాలు టాంకులు విమానాలను, యంత్రాల మరమ్మత్తు పరికరాలను ఎక్కువగా పంపుతూవుండాలి. మాస్కోలో జరిగిన మూడు రాజ్యాల ప్రతినిధుల సభలో అందుకు తగిన యేర్పాటులు చేయబడినవి. ఈ సహాయం చేరిందంటే రష్యా విజయం తప్పదు. ఆ సహాయం తప్పక చేరగలదు.

# “ప్రపంచంలోకల్లా గొప్ప యోధులు.”

## సిరియాలో సిక్కు సైనికుల చర్యలు.

మొదటి పంజాబీ రెజిమెంటు సైన్యం వెంటనున్న విలేఖరి యొకడు, ఆ సైన్యం సిరియాలోచేసిన ఘనకార్యముల గూర్చి యిట్లు వ్రాసెను :—

పంజాబు సిక్కుల సైన్యం సిరియాలో మొట్టమొదట కిస్వెళ్ళు గ్రామంవద్ద పెద్ద యుద్ధం చేయవలసి వచ్చెను. ఈ గ్రామాన్ని నగరాన్ని శత్రుసైన్యం నాల్గు బెటాలియనులు (సుమారు మూడున్నర వెయ్యి) వశపరచుకొని యున్నవి. పంజాబు రెజిమెంటులో ఒక బెటాలియను వారి నెదుర్కొని గ్రామాన్ని వశపరచుకొన ఉత్తరువు చేయబడెను. తొలి రోజున వారి నాయకుడు, మీ జీవితంలో కల్లకష్టమగు పని మీరు చేయవలసియుంది, జాగ్రత్త యని హెచ్చరించెను. ఈ పని ప్రపంచంలో యింకేసేన చేయలేదు. పంజాబీలు మాత్రం చేయగలరని అతడనెను. 1941 వ సం॥ జూన్ 15 వ తేది రాత్రి 8-15 గంటలకు దాడి ప్రారంభమైంది. గ్రామం మధ్యనున్న శత్రుసేనను సిక్కులు తరిమివేయవలసియుండిరి. ముందుగా 13 అడుగులవెడల్పు అంతే లోతువున్న కాల్వ దాటవలసియుండెను. తరువాత వారికి సరీగా ఎదురుగా మరఫిరంగులు తయారుచేయబడి గుండ్లు ప్రేలుచున్నవి. వారి సేనానాయకుడు “ బోలోసోనిహాలు ” అని కేకవేయు సరికి, సిక్కులందరు “ సత్ శ్రీ అకాల్ ” అని గర్జించిరి. అట్లా మరల మరల వారు ఆరాత్రి చీకట్లు చిల్లులు పడునట్లు అరుస్తూవుండిరి. ఆ గర్జనయే శత్రువులకు అమిత భయం కల్గించెను. సిక్కులకు అంతట ఉద్రేకం కలిగింది. అందరు ఒకే వ్యక్తివలె సమకట్టుగా ముందుకు పోసాగిరి. చేతి బాంబులను విసరగ గోతులోదాగున్న శత్రు సైనికులు బయటకు రాసాగిరి. వెంటనే వారిని తుపాకి సన్నీలతో పొడిచి యుద్ధరంగమునుండి తరిమివేయుచుండిరి. శత్రువు అన్ని చోట్లనుండి పారిపోయెను. రోడ్లపైని చిందరవందరగా వారి ఆయుధాలు పడియున్నవి. సిక్కులా గ్రామంచేరి, స్థిరంగా కాలూని వెనుకనున్న తమ యితర సైన్యములతో సంపర్కమేర్పరుచుకొన ప్రయత్నించు సరికి, అచ్చటచ్చట మారుమూలలలో దాగియున్న శత్రునివహాములు మార్గనిరోధం చేసినవి. కావున యీ దాగియున్నవారిని అణచేయాలని సేనాధికారి నిశ్చయించెను.

### తెంపులేని పట్టుదల.

ఒక మరఫిరంగి మరీ అల్లరి చేయుచుండెను. సేనాధికారియే యిరువురు సిపాయిలతో దాని వైపు పోయెను. 100 గజములా మైదానంలో పోయే సరికి ప్రక్కనో మసీదు వెనుక ఆర్గురు దాగియుండి మరో మరఫిరంగిని ప్రేల్చుచుండుట గాంచిరి. వారార్గురును లొంగిపోయినట్లు సూచించుచు చేతులెత్తిరి. వారిని ఖైదీలుగా చేయుటకు సేనాధికారి దగ్గరకు పోవుసరికి, వారు గుండ్లు ప్రేల్చిరి. సేనాని తన చేతనున్న తుపాకి ప్రేల్చి ఒకని చంపెను. మిగిలినవారు గురిలేకుండా గుండ్లు ప్రేల్చిరి. అందుచే సిక్కు సేనానియు వెంటనున్న యిరువురును దాగొనుటకు అవకాశం దొరికింది. ఇంతలో మరిరెండు మరఫిరంగులు ప్రేలినవి. ముగ్గురే సైనికులు నాల్గు మరఫిరంగులను ఎదిరింపజాలరుకనుక, వెనుకకు పోదామని సేనాని అనెను. కాని వెంటనున్న సిపాయి ఒకడు వినడు. తన చేతనున్న తుపాకితో మరఫిరంగిపై “ సత్ శ్రీ అకాల్ ” అంటూ ప్రేలుస్తూనే వున్నాడు. అన్ని మరఫిరంగులను అణచివేస్తానంటాడు. అతన్ని నిలుపుట చాల కష్టమయింది. సిక్కు సిపాయిలందరిది యిదే ధోరణి. ఇంతలో క్రొత్త సైనికులువచ్చి యీ ముగ్గురు సిపాయీలకు సహాయంచేసిరి. గ్రామం పట్టుబడింది.

కాని సేనాని తాము విడచివచ్చిన కేంద్ర స్థానమునకు పోవు సరికి, దానిపై 15 టాంకుల (సాయుధ ఫిరంగి మోటారుల) సహాయంతో శత్రుసైనికదళం దాడివచ్చి యుద్ధం చేయుచున్నది. సిక్కులు అద్భుతంగా యుద్ధం చేయుచుండిరి. వారివద్ద మూడే టాంకు విధ్వంస ఫిరంగులున్నవి. శత్రు సైనిక దళంలో ముందుగా ఒక చిన్న టాంకు వచ్చుచుండెను. సిక్కులు దాన్ని తమకు 50 గజముల చేరువగా రానిచ్చి, తరువాత దానిపై ప్రేల్చిరి. కాని అది ముందుకి వస్తూనేవుంది. ఒక హావల్దారుమేజరు ప్రేల్చిన ఒక గుండు దానిలో చొచ్చుకపోయి, దాని నడుపుచున్న వానిని చంపివేసెను. టాంకు ప్రక్కకు దొర్లిపోయెను.

అంతట సిక్కులకు ఉత్సాహం హెచ్చింది. శత్రువుల మిగిలిన టాంకులు వెనుకబడ్డాయి. కాల్బలమును సిక్కులెదిరించి నిలిపివేసిరి. గెల్చినట్లె సిక్కులు కేకలువేసిరి. కాని ప్రమాదం ముందున్నది. వారి మందుగుండు అయిపోతున్నది. వెనుకనున్న తమవారిని చేర వీలులేకుండా శత్రువులు దారి కట్టిరి. ప్రతి గుండు శత్రువును చంపితీరాలని ఉత్తరువు చేయబడెను. చివరకు 50 కాల్పులకు సరిపోవు గుండ్లే మిగిలేయి. తుపాకులకు సున్నీలు తగిలించి సిక్కులు రక్షించుకోడానికి సిద్ధపడ్డారుకాని వెనుకతగ్గలేదు. అదృష్టవశాత్తు సేనాని కేంద్ర స్థానంతో టెలిఫోనులో మాట్లాడగల్గెను. 20 నిముసాలలో ఒక సైనికదళం మందుగుండుతోకూడ వచ్చెను. మందుగుండు కోరేంగాని, సైనికులనెందుకు పంపాలని మొదటివారు విసుక్కున్నారు. శత్రువు పూర్తిగ ఓడింపబడెను. శత్రువుల సైన్యంలో సగం, నాల్గు టాంకులు నాశనమైనవి. పంజాబీల ధైర్యం పట్టుదల యింకెక్కడ చూడలేదని, పట్టుపడిన శత్రు సైనికోద్యోగులంగీకరించిరి.

---

# ఇండియాకు యుద్ధ పరికరాలు త్వరగా వస్తాయి.

## దేశరక్షణ సంఘమునకు చర్చిలు ప్రధాని సందేశం.

ఇండియా జాతీయ రక్షణ సంఘం ప్రథమ సమావేశం సిమ్లాలో అక్టోబరు 6 వ తేదీన జరిగినపుడు, సేనాధిపతి జనరలు వావెలుగారు, చర్చిలు ప్రధానివద్దనుండివచ్చిన యీ దిగువ సందేశమును సభలో చదివిరి :—

"ఇండియా యుద్ధానికి చేస్తున్న సహాయం అంతటి గూర్చి మీరు తెలిపినదంతయు నాకు నచ్చినది. యుద్ధం మొదటి ఏడాదిలో ఇండియా సైన్యానికి కావలసిన ఆయుధాలు దొరకలేదు. రెండో యేడు కొంతపని జరిగింది. మూడో యేడు నానాటికి పెరుగుచున్న భారతదేశ సైన్యానికి విశేషంగా ఆధునిక యుద్ధమారణ యంత్ర సామగ్రి సరఫరా చేయబడును. ఈ యుద్ధంలో భారతపుత్రులు అప్పుడే సైనికయోధులకుండే అత్యధిక గౌరవ మర్యాదలు బడయుటకు అర్హులని రుజువు చేసిరి. సుడానులోని సిరనైకా ఇరిట్రియా, అబిసీనియా, సిరియాలందును, యిటీవల పెర్షియాలోను భారతీయ సేనలు యుద్ధంచేసినపుడల్లా చాల ప్రాముఖ్యత వహించి ప్రశంసలబడసినవి. 1942 లో ఇండియా సైనికులు తోడి బ్రిటిషు సైనికులతో కలసి, రష్యాలోని కాస్పియను తీరంనుండి ఈజిప్టులో నైలునదివరకు గల విశాల యుద్ధరంగమునందు పోరుచుందురు. ఈ పోరువలన యుద్ధం తూర్పునకు రాకుండా అరికట్టి, హిందూస్థానమును తమ గృహములను రక్షించుకోగలరు. ఇది మహా గౌరవప్రదమగు కార్యము. అంతేకాక చాల యుక్తి యుక్తమగు కార్యమని కూడా అందరు అంగీకరింతురు. ఇండియా మేలుకోరినా, ప్రపంచ శ్రేయము కొరకైనా యిదే ముఖ్యకర్తవ్యము."

---

# హిట్లరు శాంతియే కోరెనట.

# రష్యా యుద్ధం సమర్థించుచు హిట్లరు ఉపన్యాసం.

## తన జీవితంలోకల్లా కష్టమగు నిర్ణయం చేసెనట.

## జర్మనీలోని విమర్శలకు సమాధానం చెప్పుకొనెను.

జర్మను నియంత హిట్లరు యీ నెల 3 వ తేదీన యుద్ధరంగంనుండి అకస్మాతుగా బెర్లిను ముఖ్యపట్నమునకు వచ్చి, తమ నాజీపార్టి వార్షిక సభయందుపన్యసించెను. శీతకాలంలో యుద్ధకార్యాలకు సహాయంచేయాలని ప్రజలను హెచ్చరించుచు, రష్యా యుద్ధంచేయుటకు కారణాలను హిట్లరు తెలిపెను. గత రెండు రోజులనుండి రష్యారంగంలో బ్రహ్మాండమగు యుద్ధం జరుగుచున్నదనియు, యీ యుద్ధం తూర్పున వున్న శత్రువును పూర్తిగ ఓడించుటకు తోడ్పడగలదనియు చెప్పెను. రష్యా జర్మనీపైకి దాడిరానున్నదని తెలిసియే ముందుగా రష్యాపై తాను దాడి జరిపితిననెను. తాను శాంతినే సర్వదాకోరుచుండెను కాని యుద్ధాన్ని కోరలేదనియు, ఇదివరకుకూడ ఇంగ్లాండుతో సఖ్యతకోరగా ఇంగ్లాండు నిరాకరించుటచేతనే ఆ దేశంతో యుద్ధంవచ్చిందనియు చెప్పెను. హిట్లరు ఒక గంటసేపు మాట్లాడెను. ఇదివరకాతని ఉపన్యాసం మే 4 వ తేదీన జరిగెను. నాటికి నేడు తిరిగి ఉపన్యసిస్తు తన చర్యను సమర్థించుకొనుట కింతో పాటుబడెను. దీనిబట్టి తన జర్మనీదేశంలోనే యీతని చర్యపై విమర్శలు ఎక్కువ బయలుదేరుతున్నాయని ఎంచవచ్చును.

ఉపన్యాసమునందు ముఖ్యభాగాలు యిట్లున్నవి :—

నేనింతకాలం ఎందుకు నోరుమూసుకొనియున్నానా అని ఆశ్చర్యపడు రాజకీయ వేత్తలకు జవాబుచెప్పుటకై నేను రాలేదు. చలికాలం కార్యక్రమానికి సహాయంచేయ ప్రజలను కోరుటకు వచ్చితిని. గత 48 గంటలనుండి బ్రహ్మాండమగు యుద్ధం జరుగుతున్నది. అది తూర్పున మన శత్రువును ఓడించుటకు తోడ్పడగలదు. నేడు యుద్ధంచేస్తున్న లక్షలకొలది సైనికుల తరఫున నేను మాట్లాడుతున్నాను. మా పేర్లు శాశ్వతం చేసుకోడానికి మేము యుద్ధం చేయడం లేదు. అందుకు శాంతిసమయంలో మేముచేసిన పనులే చాలును. యుద్ధం మా లక్ష్యమే కాదు. కాని జర్మనీ స్వాతంత్ర్యమును మేము యెన్నడు విడువము.

యుద్ధానికి పూర్వం తమ నాజీ పార్టీచేసిన ఘనకార్యములన్నీ వికరువుపెట్టిన తరువాత ఫాసిస్టు ఇటలీ నాయకుడగు ముసోలినీతోను, జపానుతోను తాము సర్వదా సఖ్యతగా నున్నామని హిట్లరుచెప్పెను.

## ఇంగ్లాండుతో సఖ్యత చెడుట.

"ఇంగ్లాండుతో సఖ్యతగనుండుటకు నే చేసిన ప్రయత్నములు సఫలంకాకపోయినపుడు, యిక ఆ దేశంతో సఖ్యత కుదరదనే నిశ్చయంచేసుకున్నాను. యుద్ధప్రియులపుడు నా స్నేహం నిరాకరించుట మంచిదికాదని తెలుసుకోలేకపోతే యిపుడైనా తప్పక తెలుసుకొనియుందురు. చివరకు ఆయుధాలే ఆ విషయాన్ని నిర్ణయించవలసియుండెను.

"రెండేండ్లగా జర్మనీ ఒక శత్రువు తర్వాత యింకో శత్రువును పడగొట్టుచున్నదనుట చరిత్ర ప్రసిద్ధమయింది. నేనది కోరలేదు. మొదటి రంగం ముగియగానే, స్నేహం కోరితిని, యుద్ధప్రియుడగు చర్చిలు నిరాకరించెను. అందుచే నూరేండ్లవరకు చరిత్రలో చిరస్థాయిగ ఉండిపోవు నిర్ణయం యుద్ధంవల్లనే జరగాలని నేను నిశ్చయించుకొంటిని" అని హిట్లరు తెలిపెను.

## రష్యాతో పోరు.

"రష్యాతో రాజీ కుదుర్చుకొనుటకు నామంత్రిని మాస్కోనగరానికి పంపితిని. ఇచ్చిన మాటప్రకారం జర్మనీ పత్రికలలో రష్యా బొల్షివిజంగూర్చి ఒక్క ప్రతికూలవాక్యం కూడ పడలేదు. మోలటావు (రష్యా మంత్రి) యిపుడు కాడంటాడు కాని డార్డెనల్సులో సైనిక శిబిరాలుంచుకోవాలని రష్యా కోరెను. రష్యాను శ్రద్ధగ గమనిస్తూనే ఉన్నాము. గత మే మాసమునందే మాపైపడుటకు రష్యా తొందరపడుచున్నదని స్పష్టమయింది. నేనే ముందు దెబ్బకొట్టడానికి వీలుండేవరకు నేను ఊరకొంటిని. తూర్పు ప్రష్యాయందు మావి మూడు డివిజనుల సైన్యంమాత్రమే ఉండగా, రషియా 22 డివిజనుల సేనను అచట సమకూర్చెను. అందుచే అపుడు నాకు కొంత ఆందోళన కలిగెను. వెనుక యీ రష్యా నాపైపడుటకు సిద్ధంగానుండబట్టియే, జర్మను విమాన దళం అంతటా పనికల్పించు ఇంగ్లాండు దాడికి గత వత్సరం ఆగస్టు, సెప్టెంబరు మాసాలలో వీలులేకుండెను."

రష్యా మంత్రి మోలటావుగారు బెర్లినువచ్చి తమను నాల్గు షరతులు కోరెననియు, అవి తాము అంగీకరింప వీలులేకుండెననియు హిట్లరు తెలిపెను. అందు మొదటిది ఫిన్లాండును రష్యా ఆక్రమించుట. అందుకు తా నంగీకరింపజాలకుండెను. రెండోది రుమేనియాపై రష్యా దాడి వెడలినచో జర్మనీ రక్షించునా యని కోరగా ఆవిషయంలోగూడ హిట్లరు రుమేనియాకిచ్చినమాట పాటింతుననెను. బల్గేరియాకు రష్యా సేనలు పోనివ్వాలని, బల్గేరియాకు రష్యా హామీగా నుంటుందని మోలటావుగారు సూచించిరి. కాని ఆ విషయం బల్గేరియా యిష్టంపై నాధారపడియుండుననియు, తన మిత్రదేశములతో సంప్రదించవలసియుండుననియు హిట్లరు తెలిపెనట. నాల్గోది డార్డనల్సు జలసంధియందు (నల్ల సముద్రద్వారం) సైనిక శిబిరాలను రష్యా కోరెను. దానితో రష్యా ఉద్దేశం నాకు స్పష్టంగా తెలిసిపోయింది. అప్పటినుండి నేను రష్యాను శ్రద్ధగా గమనించుచుంటిని."

"నా జీవితంలోకెల్లా ముఖ్యమగు నిర్ణయం చేయవలసి వచ్చింది. ప్రపంచచరిత్రలోకెల్లా పెద్దయుద్ధం ప్రారంభమయింది. అప్పటినుండి ఇప్పటివరకు అనుకున్న ప్రకారం యుద్ధం సాగుచున్నది. మేము ఏవిషయంలోను తప్పుఅంచనా వేయలేదు. జర్మను సైనికుల ధైర్యంగూర్చిగూడ మాకు సందేహంలేదు. శత్రువుచేసిన బ్రహ్మాండమగు ముందు ప్రయత్నము గూర్చి వాటివలన యూరోపుకుగల ప్రమాదంగూర్చి మా యూహలు తప్పకావు."

## నష్టాల వివరం.

ఆర్కిటికు సముద్రంనుండి నల్లసముద్రంవరకు కడు దీర్ఘమగు యుద్ధరంగమున తమ సైన్యాలు, తన మిత్రమండలి దేశాలగు ఫిన్లాండు, ఇటలీ, హంగేరి, రుమేనియా, స్లోవాకు, క్రోటు, స్పెయిను, బెల్జియం, హాలెండు, డెన్మార్కు, నార్వే, చివరకు ఫ్రాంసు సైన్యాలు చేయుచున్న ఘనకార్యములను హిట్లరు కొనియాడెను.

"జర్మను ప్రభుత్వ ప్రకటనలు సత్యమైన ప్రకటనలు—వాటినిగూర్చి వేరే రుజువు లక్కరలేదు. 2,500,000 రష్యనులు ఖైదీలుగా నున్నారు, 20,000 ఫిరంగులు, 18,000 టాంకులు వారివి నాశనంచేసితిమి. రష్యా విమానాలు 14,500 పడగొట్టితిమి" అని హిట్లరు తెలిపెను.

రష్యాలో జర్మను లెంత మేర చొచ్చుకపోయిరో తెల్పుచు హిట్లరు యిట్లనెను: "ఈ యుద్ధం దీర్ఘకాలం కొనసాగినచో యిపుడు మనం ఆక్రమించిన ప్రాంతాలు మనకు బాగా తోడ్పడగలవు. వాటిని బాగా ఉపయోగించుకోగలమనుటకు ఎట్టి సందేహంలేదు."

## హిట్లరు సంజాయిషీ చెప్పుకున్నాడు.

హిట్లరు ఉపన్యాసంగూర్చి ఇంగ్లాండులో అభిప్రాయమేమంటే, నాజీపార్టీపై జర్మనీలో బయలుదేరుచున్న విమర్శలకు జవాబుగ సంజాయిషీ ఒకగంటసేపు చెప్పుకున్నాడని. 1934 లో తమ పార్టీలో మిత్రులుగానున్న పెద్దవారందరు హత్యగావింపబడిన తరువాత రెండుగంటలసేపు యిట్లే క్షమాపణ తెలుపుకొనెను. మొదటినుండి చివరవరకు తనచర్యను సమర్థించుకొనుచుండెను. ఈ ఉపన్యాసాన్ని బట్టి జర్మనీలో అతనికి ప్రతికూల విమర్శ హెచ్చుతున్నదని లండనులో అనుకుంటున్నారు. రష్యాపై యుద్ధంచేయడంలో మేము పొరబాటు చేయలేదా అని పలుమారు చెప్పడం, మేము స్నేహం శాంతికోరితిమి అని పదేపదే అనడం, యిందుకు తార్కాణాలు. జర్మను సైనికాధికారుల ప్రకటనలు నిజమనికూడ యితను నొక్కిచెప్పడంబట్టి, బయటివారివలెనే జర్మనీ ప్రజలుకూడ వీటి యదార్థత సందేహిస్తున్నారన్నమాట.

ఈసాలాంతంలోగా యుద్ధం ముగిస్తామని వాతావరణం అనుకూలంకాగానే ఇంగ్లాండుపై దాడిచేస్తామని మార్చిలో జర్మనుమంత్రి గోబెల్సు చెప్పినది నమ్మిన జర్మనులకు హిట్లరు ఉపన్యాసం ఆశాభంగం కలిగించును. అతడు దీర్ఘకాలం యుద్ధం కొనసాగునని సూచించెను.

బ్రిటనులో పత్రికలు హిట్లరు ఉపన్యాసాన్ని విమర్శిస్తూ, హిట్లరుయెడల జర్మనుప్రజలు న్యాయంగా ప్రవర్తించలేదని డాక్టరు గోబెల్సు తొలిరోజునే చెప్పియుండెననియు, ఆమాటను హిట్లరు తన చర్య సమర్థించుకోడంతో చేర్చిచూస్తే జర్మనీ ప్రజలకు అతనిపై అవిశ్వాసం ప్రబలుచున్నదని తెలియగలదనియు స్పష్టంచేసినది. హిట్లరు తనకు స్నేహంగావున్న దేశాలపేర్లను వరుసగా ఏకరువుపెట్టెనేగాని, ఆ దేశాలన్నింటిని తాను పెద్ద జెయిలుగా మార్చితిననికాని, అందలి ప్రజలు తనను పూర్తిగ ద్వేషిస్తున్నారనిగాని చెప్పలేదు.

హిట్లరు ఉపన్యాసంలో చాల అబద్ధాలు, అసందర్భాలున్నాయి. అధికారప్రమత్తత చే ఆయన ప్రగల్భములు పలికెను. రష్యాను తాను ఓడించగలననెను. కాని నిజం నిలకడమీద తెలియగలదు. తాను జయించినను లేకున్నను, చనిపోయిన జర్మనులను అతడు బ్రతికించలేడనిమాత్రం జర్మను లెరుంగుదురు. మానవకోటి ప్రేమ కాతడెన్నడు పాత్రుడు కాజాలడు. అని అమెరికను పత్రికలు విమర్శించినవి.

చూచారా, ఇదే బ్రిటీషువారి బ్రహ్మాండమైన యుద్ధనౌక.



ఈ నౌకపేరు ‘ప్రిన్సు ఆఫ్ వేల్సు’ అంటారు. ఇది క్రొత్తగా తయారయినది. బలములోను బరువులోను దీనికి మించిన నౌక లేదనే చెప్పవచ్చు. దీనిపొడవు 740 అడుగులు, 10 పెద్ద ఫిరంగులు, 16 చిన్న ఫిరంగులు అమర్చబడి వున్నవి. 4 విమానములుకూడ దీనిలో వున్నవి. విరోధి విమానాలను పడగొట్టడానికి అవసరమైన ఆయుధములు అనేకముగా వున్నవి. దీనిలో 1,500 నావికులు పనిచేయుచున్నారు.

---

# ఇండియాలో యుద్ధ ప్రయత్నం.

## భారతీయ సైనికులకు జేజేలు.

భారత జాతీయ రక్షణ సంఘం (నేషనల్ డిఫెన్సు కౌన్సిలు) ప్రారంభోత్సవం జరుపుచు ఘనత వహించిన వైస్రాయిగారు యుద్ధానికి సైన్యం, సరకు, ధనం పంపి ఇండియా చేయుచున్న అపరిమితమగు సహాయమును కొనియాడిరి. వారిట్లనిరి :—

“మనము ఎందు కొరకు యుద్ధం చేయుచున్నామో ఆ ఆ ధర్మముల సాధించుటకు ఇండియా చేయుచున్న అమోఘమగు సహాయమును గూర్చి తెల్పుటకు యింతకన్న మంచి సమయముండదు. నిస్సంకోచంగా సైనికులు, ద్రవ్యం, సామానులు ఇండియానుండి ప్రవాహంగా వెడలుచున్నవి. భారతీయ సైనికులు నేలను నౌకలపైని విమానాలలోనుండి యుద్ధం చేసి తమకూ తమ దేశానికి కీర్తిగడించిరి. క్రొత్తరకాల యుద్ధ పరికరాలనెదిర్చి, అపరిచితమగు స్థలాలలో, అతి కష్ట పరిస్థితులయందును భారతీయ సైనికులు, స్వస్థానాలనుండి వచ్చినవారు బ్రిటిషు ఇండియానుంచి వచ్చినవారు కూడ, అసమాన ధైర్య సహనములు కన్పరచి, యీ దేశ ప్రతిష్ఠకు మరింత వన్నె దెచ్చిరి. భారత దేశమును బ్రిటిషు సామ్రాజ్యమును వారికి మరువరాని రీతి ఋణపడియున్నవి.

“ఈ సందర్భమున మన పొరుగురాజ్యమగు వీరప్రశస్తిగన్న నేపాలురాజ్యంచేసిన సహాయమునకు కృతజ్ఞత తెలుప వలసియున్నది. నేపాలు ప్రధానియొక్క ఉత్సాహం సానుభూతి మన కెంతయు తోడ్పడినవి. వారి సైనికులు వెడలిన యెల్లచోట్ల ప్రశంసార్హముగ పోరు సలిపిరి.

“సరకు సప్లైచేయడంలో ఇండియా అపరిమితమగు సహాయంచేసెను. ఈ సహాయం సామ్రాజ్యం అంతా గుర్తించెను. ఇందువలన ఇండియాయొక్క భౌతిక సంపదయేగాక, భారతీయుల ప్రజ్ఞ, నేర్పు, సహాయంచేయాలన్న కుతూహలంకూడా విదేశాలకు వెల్లడైనవి. ఈస్టరను గ్రూపు సప్లై కౌన్సిలు (అంటే, తూర్పుదేశాల సరకు సప్లై సంఘం) కేంద్రస్థానం ఇండియాలో నుంచుట, ఇండియా అన్ని దేశాలకు మధ్యగా నుండుటవల్లనే గాక, దాని ప్రాముఖ్యతను, ఇండియా యిదివరకుచేసిన యిప్పుడు చేయుచున్న యిక ముందుచేయగల సహాయముయొక్క ఆధిక్యతను, గుర్తించియే జరిగెను.

“యుద్ధసిద్ధికి చందాలు, ఋణాలు, నగదు రూపంగాను వస్తురూపంగాను ధారాళంగా వస్తున్నాయి. విమానాలు, టాంకులు, మందుగుండు, వైద్య సహాయం, మోటారులు కొనుటకును, గాయపడినవారి సహాయార్థమును యుద్ధం ప్రారంభమయినప్పటినుండి ఇండియానుండి ద్రవ్యం విరామం లేకుండా వస్తూనేవుంది, తగ్గ లేదు. సంస్థానాధీశులును, బ్రిటిషు ఇండియా రాష్ట్రములును లక్షలకొలది దేశీయులు యీ సహాయంచేయుచున్న వారందరికి హృదయపూర్వకంగా కృతజ్ఞత తెలుపుచున్నాను. మీరంతా స్వార్థత్యాగం చేసి విజయం త్వరగా చేకూరునట్లు తోడ్పడుచున్నారు.”

# ఈ వారం యుద్ధ వార్తలు.

## విమాన దాడి.

సెప్టెంబరు 1 వ తేది బుధవారము రాత్రి వాతావరణము అనుకూలముగ లేకపోవుటచే జర్మనీపై అంత విస్తారమగు దాడులు సాగింప వీలులేకపోయెను. అయినను కొన్ని విమానములు జర్మనీయందలి నైరుతి ప్రాంతముపైకి జని స్టట్‌గార్టు మొదలగు పారిశ్రామిక పట్టణములను, కెలె, బులోక్, ఓస్టెండు మొదలగు ఫ్రెంచి, బెల్జియం తీరపు రేవులపైనను బాంబులవేసెను. రాత్రి పోరాటమున ఒక జర్మను విమానము పడగొట్టబడెను. 2 వ తేది మధ్యాహ్నము, వందల కొలది విమానములు, ఫ్రాన్సునందు ఉత్తర ప్రాంతపు పట్టణములపైకి జని, యంత్రాలయములపైనను రైల్వే స్టేషనులపైనను బాంబులుల వర్షించెను. ఇంగ్లీషు చానలుపై జరిగిన పోరాటమున నాల్గు శత్రు విమానములు పడగొట్టబడెను. మూడు బ్రిటిషు విమానములు తిరిగిరాలేదు. గురువారము రాత్రి, ఫ్రెంచి తీరపు బ్రెస్టు రేవుపైకి చాల బ్రిటిషు విమానములు దాడివెడలి అచటనున్న జర్మను నౌకలపై బాంబులువేసెను. శుక్రవారం వుదయం 'గ్రేవ్‌లైన్సు' సమీపమున, శత్రు నౌకల నెదిర్చి ఒక సప్లయి నౌకను, మూడు విమాన ధ్వంసక ఫిరంగులుగల చిన్న నౌకను తగులబెట్టెను. మరియొక నౌక ముంచివేయబడెను. మధ్యాహ్నము చాల విమానములు ఆస్టెండు రేవుపై బాంబులువేసెను. రేవునందు చాల పెద్దమంటలులేచెను. ఒక శత్రు విమానము పడగొట్టబడెను మూడు బ్రిటిషు విమానములు తిరిగి రాలేదు. నాటి రాత్రి మరికొన్ని విమానములు బెల్జియం, హాలండులలోని డంకర్కు, ఆంట్వర్పు, రాటర్డాం రేవులపై పెద్ద దాడుల సాగించి, అపారమగు నష్టముగల్గించెను. డెన్మార్కు, ఫ్రాన్సులలో శత్రు విమానాశ్రయములపైగూడ, బాంబులు, ఫిరంగి గుండ్లు వర్షింపబడెను 6 వ తేది ఉదయము బ్రిటిషు విమానములు బెల్జియము తీర ప్రాంతమున గపించిన చిన్న సాయుధ శత్రు నౌకల నెదిర్చి రెంటిని ముంచివేసెను. మరియొక నౌకకు చాల దెబ్బలుతగిలి శిథిలమయ్యెను.

సెప్టెంబరు 1 వ తేది రాత్రి, కొలది జర్మను విమానములు మాత్రమే బ్రిటనుపైకివచ్చి, అక్కడక్కడ పలు ప్రాంతములలో బాంబులు వేసిపోయెను. వానివలన గల్గిన నష్టము అల్పము. ప్రాణనష్టము అత్యల్పము. 2 వ తేది రాత్రి బ్రిటనుపైకివచ్చిన శత్రువిమానములలో 5 పడగొట్టబడెను. బ్రిటను ఈశాన్య ప్రాంతమున, ఆగ్నేయప్రాంత శత్రు విమానములు ఎక్కువ చురుకుగ దాడులు సాగించుట కెత్తించెను. ఈశాన్యప్రాంతపు పట్టణములపై దాడి వరుసగా కొన్ని గంటలు జరిగెను. దక్షిణ తీరమున నొక పట్టణముపైకి చాల శత్రు విమానములు రెండు తెరలుగావచ్చి, తీవ్రమగు దాడులజరిపెను. ఈ దాడులలో మూడు శత్రు విమానములు పడగొట్టబడెను. 3 వ తేది రాత్రి ఇంగ్లండు, స్కాట్లండు తూర్పు తీరపు పట్టణములపై శత్రువిమానములు మరల దాడివచ్చి చాల బాంబుల వర్షించి స్వల్పముగ నష్టము కల్గించెను. ప్రాణనష్టము ఏమాత్రమును గలుగలేదు. 4 వ తేది రాత్రిగూడ, తూర్పు తీరముపై స్వల్పముగ బాంబులు పడెను. ఒక మనిషి మరణించెను. ఆదివారము రాత్రి బ్రిటను తూర్పు, నైరుతి ప్రాంతములపై మరల స్వల్పముగ శత్రు విమానదాడి జరిగెను. కాని యెక్కడను నష్టము గల్గినటుల వార్తలు లేవు.

గత వారము యిరోపా పడమటి భాగంలోను, మధ్య ప్రాచ్యరంగాలలోను 2 శత్రు విమానములు పడగొట్టబడెను. 48 బ్రిటిషు విమానములు నష్టమయ్యెను. ప్రస్తుతం జర్మనీలో ఉత్పత్తియగుచున్న వానికంటె అన్ని రంగాలలోను నెలకు 300 జర్మను విమానములు అధికముగ నష్టపడుచున్నటుల అంచనావేయబడెను.

ఈ సంవత్సరాంతములోగా, నెల 1 కి 2,500 విమానముల నిర్మించ గల్గుటకు అమెరికను ప్రభుత్వమువారు ప్రయత్నములొనర్చుచున్నారు. ప్రస్తుతము బ్రిటిషు, అమెరికా, రష్యను యంత్రశాలలో నెలకు 6,000 విమానములు తయారగుచున్నవి, జర్మనీలో 3,000 విమానముల కంటె యెక్కువ తయారగుట లేదు.

## ఇటలీ - ఆఫ్రికా - మధ్య ధరా.

5 వ తేదిన బ్రిటిషు విమానములు సిసిలీలోని కటానియా రేవుమీదను, ఉత్తర ఆఫ్రికాలోని బెంఘాజీ రేవుమీదను తీవ్రమగు దాడి సాగించెనని ఇటాలియనులు అంగీకరించిరి.

1 వ తేది రాత్రి బ్రిటిషు విమానములు, ఉత్తర ఆఫ్రికా తీరమునందలి ట్రిపోలీ (ఇటాలియను) రేవుపై భయంకరమగు దాడి జరిపెను. బాంబుల ప్రేలుడువలన రేవునందలి పెద్ద గిడ్డంగులన్నియు పరశురామ ప్రీతి అయ్యెను. 3, 4 వ తేదిలలో ఈజిప్టునందలి దక్షిణాఫ్రికా విమానములు బద్రియా (లిబియా) రేవుపై దీర్ఘమగు దాడి జరిపెను.

6 వ తేది వుదయము, సూయజు కాలువ ప్రాంతముపై శత్రు విమానములు బాంబులువేసినవి. ఆస్తికి కొంత నష్టము గల్గినదిగాని ప్రాణనష్టమేమియు గలుగలేదని ఈజిప్టు అధికారులు ప్రకటించిరి.

అబిసీనియా యొక్క ప్రత్తినిగురించి, అబిసీనియా చక్రవర్తియును బ్రిటిషు ప్రభుత్వమును గావించుకొనిన ఒడంబడికను, బ్రిటిషు ప్రభుత్వము యింకను పరిశీలించుచున్నదని పార్లమెంటులో ఈడెను ప్రధాని నుడివెను.

మధ్యప్రాచ్యరక్షణకు అవసరమగు ఏర్పాటులను జేయుటకుగాను ఈజిప్టులో బ్రిటిషు ప్రభుత్వము వారొక యుద్ధ సలహాసంఘము నేర్పరచిరి. అందు భారత దేశమునకు గూడ ప్రాతినిధ్య మొసగిరి.

## టర్కీ - ఇరాక్ - ఇరాన్.

టర్కీ ప్రభుత్వముతో వర్తక యొడంబడిక గావించుకొనుటకు వచ్చిన డాక్టరు క్లాడియస్ గారును, జర్మను రాయబారియగు వాన్ పేపన్ గారును, వర్తక ఒడంబడిక కుదురకపోవుటచే 1 వ తేదినే అంకారా (టర్కీ రాజధాని) నుండి ప్రయాణమైపోవుటకు నిశ్చయించిరి. కాని జర్మను ప్రభుత్వమునుండి వచ్చిన సూచనలను పురస్కరించుకొని వారు ప్రయాణము వాయిదా వేసుకొనిరి. 1942 వ సంవత్సరాంతమువరకు క్రోమును బ్రిటనుకే విక్రయించునటుల ఒడంబడిక చేసుకొనియుంటిమనియు, అందుచే అంతవరకు దానిని జర్మనీకి సప్లైచేయ వీలుకాదనియు టర్కీ ప్రతినిధులు తెలిపిరి.

రిటైర్డు టర్కీ సేనానియగు యెర్కిలెట్ సేనానియు, యుద్ధ శాస్త్ర కలాశాలాధికారియగు పాట్‌యెర్క్ గారును రష్యా యుద్ధరంగమును జూచుటకు జర్మనీకి ప్రయాణమై వెడలుచున్నారు.

జెరూసలంలో, ఇదివరకు మహమ్మదీయుల పెద్ద మత గురువుగనున్న "గ్రాండు మఫ్తీ" ఇంతవరకు ఇరాన్‌లో జపాను రాయబారి కార్యాలయమున దాగియుండెను. అతడిపుడు ఆ కార్యాలయము వదలి దేశములోనికి జని యెచ

టునో దాగియుండెనని తెలియుచున్నది. ఇరాక్‌లోనున్న కుట్రదారు లందరిలోను యితడే పెద్ద కుట్రదారు.

ఘాజీ షా అగు రిజా అలీ ఖాన్‌గారి బ్యాంకులో నిలువ యున్న ధనమంతయు క్రొత్త 'షా' పేర మార్చివేయబడెను. ఘాజీ షా, అర్జెంటైన్ (దక్షిణ అమెరికా) దేశమున నివసించుటకు ఆ దేశపు ప్రభుత్వపు అనుమతిని గోరెననియు, అనుమతి యొసగబడెననియు దెలియుచున్నది.

ఇరాక్‌లో జపాను రాయబారి కార్యాలయమునకు గల ప్రత్యేక హక్కులు తాత్కాలికముగ తొలగింపబడినందులకు జపాను ప్రభుత్వము ఇరాక్ ప్రభుత్వమునకు ఆక్షేపణను దెలిపెను.

ఇరాక్ మీదుగా రష్యాకు యుద్ధ సామగ్రిని సప్లై చేయుటకు గాను, ఇరాక్‌లో రైల్వే రహదారీ సౌకర్యములు చక్కబరుపబడెను. ఇరాక్ యొక్క నాణెముల మారకపు పద్ధతులు గూడ సంస్కరింపబడెను.

క్రొత్తషాయగు షాపూర్ మహమ్మద్ రిజాగారు తన రాజ్యాంగ విధానమును వివరించుచు, ఇప్పటికంటెనుగూడ బ్రిటిషు మంత్రి మండలితో అధికతరమగు సహకార మొనర్పదలచితినని ప్రకటించెను.

రుమేనియానుండి టర్కీకి పెట్రోలు నూనెల సప్లై చేయుటకు వీలులేదని జర్మను అధికారులు నిరాకరించిరి. టర్కీకి కావలసిన నూనెను తాము సప్లై చేసెదమని రష్యా ప్రభుత్వము వాగ్దాన మొనర్చెను.

టర్కీ జర్మను వర్తక యొడంబడిక 8 వ తేదిన ఉభయ పక్షములును సంతకము లొనర్చియుండెను కాని తుది క్షణమున భిన్నాభిప్రాయము లేర్పడుటచే మరల వాయిదా వేయబడెను. ఈ యొడంబడికలో జర్మనీకి "క్రోమును" సప్లై చేయజాలమని టర్కీ అధికారులు స్పష్టముగ తెలియజేసిరి.

ఇరాక్‌లోగారి మిక్ కుడ్ఫాయిల్‌గా మంత్రివర్గము 4 వ తేదిన రాజీనామా నొసగెను. ప్రస్తుతము ఈజిప్టులో రాయబారిగనున్న నూరీపాషాను ప్రధాన మంత్రిపదవి అంగీకరించి మంత్రివర్గము నేర్పరుపవలెనని ఇరాక్ పరిపాలనకర్త కోరెను.

మధ్యప్రాచ్యమున మిత్రమండలి సేనలకు నాయకత్వపు యేర్పాటు లిపుడు సవరింపబడెను. ఇరాక్—ఈరాన్ దేశములలో బ్రిటిషు సైనికులకు, భారత దేశపు సర్వ సేనానియగు వేవలుగారి నాయకత్వమునందే యుంచబడెను. సిరియా పాలస్థానం మొదలగు ప్రాంతములను ఈజిప్టు ప్రాంతమునందలి బ్రిటిషు సేనలకు అచిన్‌లెక్‌గారు సేనానాయకుడుగ నిర్ణయింపబడెను.

## అమెరికా—అట్లాంటిక్.

ఐస్లాండు ప్రాంతమున మరియొక అమెరికను నౌక 1 వ తేదిన శత్రు జలాంతర్గాములచే ముంచివేయబడెను.

శత్రు జలాంతర్గామిచే ముంచివేయబడిన అమెరికను "నూనె" టాంకరునుండి ముగ్గురు మాత్రమే రక్షింపబడిరి.

సంయుక్తరాష్ట్ర నౌకాదళశాఖ కార్యదర్శియగు కర్నలు నాక్సుగారు 1 వ తేదిన మాటలాడుచు వి ప్రాంతమున యొట్టి రక్షణమును గోరినను ఇచ్చుటకు అమెరికను నౌకాదళము సిద్ధమగునని ప్రకటించెను.

సముద్రముపై శత్రునౌకలు కన్పించిన వెంటనే వానిని ముంచివేయుటకు గావించబడిన ఉత్తరువులనుగురించి "గాలప్ పోలు" పద్ధతిని కనుగొనగా ప్రజలలో నూటికి 60 వంతులు అనుకూలముగ అభిప్రాయమును దెల్పిరి.

జర్మనీని ఈమారు పూర్తిగ వోడించి శిథిలపరచుటయేగాని రాయబారములు జరిపి సంధి యొనర్చుకొనుటయనున దుండదని రూజ్వెల్టు అధ్యక్షుడు ప్రకటించెను.

ప్రస్తుతమున్న తటస్థ శాసనము ప్రకారము అమెరికను వర్తక నౌకలకు ఫిరంగులను అమర్చుట శాస్త్రవిరుద్ధమనియు అందుచే తటస్థ శాసనమును రద్దుచేయుటయో లేక సవరించుటయో చేసి తీరవలెననియు రూజ్వెల్టు అధ్యక్షుడు దెలిపెను.

అమెరికాలోనున్న జపాను, ఇటలీ, జర్మను రాయబారి కార్యాలయములు ఉద్యోగులు గావించుచున్న "వేగు చర్యల" ను కనిపెట్టి నివేదికనంపుటకు ఒక విచారణ సంఘమును నియమింపవలెనని, ప్రభుత్వ న్యాయశాఖవారి ఆమోదముతో సెనెటరు గిలట్టీ, సెనెటరు జాన్సన్ గార్లు శాసన సభలో ఒక ప్రతిపాదనను దెచ్చిరి.

ఒకే సమయమున తూర్పున పసిఫిక్ సముద్రములోను, పడమటను అట్లాంటిక్ సముద్రములోను యుద్ధము వచ్చిన యెడల నిర్వహించుకొనుటకు అవసరమగు నౌకా బలమును సిద్ధపరచుకొనుటకుగాను, రోజుకు ఒకటికంటె యొక్కువ యుద్ధ నౌకలను నిర్మించుటకు ప్రారంభించుచుంటిమని అమెరికను అధికారులు ప్రకటించిరి.

తాటస్థ్య శాసనమును సవరించుటో లేక రద్దుచేయుటో నిర్ణయించుటకుగాను రూజ్వెల్టు అధ్యక్షుడు 7 వ తేదిన శాసనసభలయందలి వేర్వేరు పక్షముల నాయకుల పిలచి సంప్రదించెను.

## రష్యా.

జర్మనీపై యుద్ధము సాగించుటకు రష్యాకుగావలసిన సహాయ్యమును నిర్ణయించుకొనుటకు మాస్కో నగరమున ప్రారంభమైన,—రష్యా, బ్రిటిషు, అమెరికా ప్రభుత్వ ప్రతినిధుల సమావేశము 1 వ తేదీన ముగిసెను. రష్యాకు కావలసిన సకల విధ సహాయము వెంటనే పంపబడునని అమెరికా ప్రభుత్వ ప్రతినిధియగు హారిమన్‌గారును, బ్రిటిషు ప్రభుత్వ ప్రతినిధియగు బీవరుబ్రూకు ప్రతినిధియు ప్రకటించిరి. యుద్ధానంతరము ప్రపంచపునర్నిర్మాణమును గురించి చర్చిలు, రూజ్వెల్టుగార్లు ప్రకటించిన ఆశయములను రష్యను ప్రతినిధులు బలపరచిరి.

హిట్లరు 2 వ తేదీన జర్మను ప్రజలకు ఉపన్యసించుచు, రెండు రోజులుగ రష్యాలో బ్రహ్మాండమగు పోరాటము సాగుచున్నదనియు దానివలన రష్యా యుద్ధ ఫలితములు త్వరలోనే తేలిపోవుననియు ప్రకటించెను. రష్యా సైనిక బలము శిథిలమైపోయెనని గూడ అతడు ప్రగల్భములు పల్కెను.

3 తేదీన రష్యను సైన్యములు యుక్రేన్‌లో జర్మను సైనిక పంక్తులమీద పెద్ద తిరుగు దాడిని సాగించి వెనుకకు తరిమిరి.

లెనిన్‌గ్రాడు నగరమును పట్టుకొనుటకు ప్రయత్నించుచున్న జర్మను సైన్యములకు నాయకుడగు వాన్‌లెబీగారు తన పదవికి రాజీనామానొసగెను. కాని అతడు తన కప్పగింపబడిన పనిని పూర్తి జేయలేదను కారణముచే హిట్లరు సదరు రాజీనామాను అంగీకరింపలేదు. 4, 5 వ తేదీలలో రష్యను సైన్యములు జర్మనులను 20 మైళ్లు వెనుకకు త్రోసివేసెను.

ఉత్తరమున లెనిన్‌గ్రాడునుండి, దక్షిణమున క్రిమియా వరకును 1,200 మైళ్ల పొడుగున జర్మనులు ముందుకు సాగిపోవుటకు ఈ వారము పెద్దదాడి ప్రారంభించిరి. ఈ దాడిని పూర్తిగ నిరోధింపగల మను దృఢ విశ్వాసమును రష్యను అధికారులు దెలుపుచున్నారు.

రష్యాలో ప్రజలకు మత స్వాతంత్ర్యము లేదను ఆరోపణలను రష్యను అధికారులు ఖండించుచు, తమ ఇష్టము వచ్చిన

మతమును మతాచారములను అనుసరించుటకు రష్యాలో ప్రజలకు మొదటినుండియు సంపూర్ణమగు స్వాతంత్ర్యముగలదని వెల్లడించిరి.

## దూరప్రాచ్యము.

ఈ నెల 1 వ తేదీన, చైనాలో, హూనాన్ రాష్ట్ర రాజధానివద్ద చైనా సైన్యములకును, జపాను సైన్యములకును బ్రహ్మాండమగు పోరాటము జరిగెను. చైనా సైన్యములకు పోరాటమున అద్భుతమగు విజయము లభించెననియు, 50 వేల జపాను సైన్యము చుట్టుముట్టబడెననియు, చైనీయులు ప్రకటించిరి. 40 వేల జపాను సైన్యము హతమయ్యెను. జపానీయులీరంగమున తమ సైన్యములను వెనుకకు మరలించుకొనుచున్నారు. ఇద్దరు జపాను సేనానులు పోరాటమున మరణించిరి. 3 వ తేదీన జపానీయులు, హూనాన్ రాష్ట్రమున పెద్ద రైల్వే "జంక్షను" అగు చెంగ్చౌను పట్టుకొంటిమని ప్రకటించిరి.

వ్లాడివాస్టాక్ రేవు మీదుగా రష్యాకు నూనె, పెట్రోలు మొదలగు సామగ్రిని డచ్చి ఇండియా రేవుల ప్రభుత్వము పంపుచున్నదనియు అట్టి చర్యను శత్రుచర్యగ పరిగణించెదమనియు జపాన్ ప్రభుత్వము ప్రకటించెను.

రష్యా మంచుకో సరిహద్దులలో రష్యనులు ఇది వరకటికంటె చాల పెద్ద సైన్యములను సిద్ధమొనర్చి యుంచుచున్నారు. ఆ దేశపు ఎగుమతి దిగుమతి వ్యాపారమంతయు జపానీయుల ద్వారానే జరుగునటుల జపాను అధికారులు క్రొత్త నిబంధనలను అమలు జరుపుచున్నారు.

చైనా పోరాటమున జపానీయులు, విషవాయువు నుపయోగించుచున్నారని చైనీయులు ఆరోపించుచున్నారు.

థాయి ప్రభుత్వము హృదయ పూర్వకముగ, తటస్థ ధర్మమును పూర్తిగా అనుష్ఠించు చున్నదని థాయిదేశములోని బ్రిటిషు రాయబారియగు సర్ జోషియా క్రాస్బీ గారు ప్రకటించిరి.

ఇండో చైనాలో, జపానీయులు, ఫ్రెంచివారి గిడ్డంగులను లాగుకొని ఆయుధసామగ్రిని నిలువ జేయుటకుపయోగించుకొనుచున్నారు.

దూరప్రాచ్యమున రక్షణ సన్నాహములను గురించి సంప్రదించుటకుగాను ఈ వారము ఫిలిప్పైను దీవుల యందు అమెరికను, బ్రిటిషు, చైనా, డచ్చియిండియా దీవుల సైనికాధికారులు సమావేశమై ఆలోచనల జరిపిరి.

జపానుకు ప్రస్తుతము వెళ్లుచున్న పెట్రోలు నూనె దిగుమతులన్నిటిని పూర్తిగ నిలిపివేయుటకు అమెరికా, బ్రిటిషు, డచ్చి యిండియా ప్రభుత్వములు నిశ్చయించుకొనినవి.

హాంకో నగరమున (చైనా) ఆంగ్లేయులు తమ ఆస్తులను ఉపయోగించుకొనుటకు వీలులేకుండా జపానీయులు కొన్ని నిషేధములను అమలు జరుపుచుండిరి. బ్రిటిషు అధికారులు ఇందుకు ఆక్షేపణల దెలిపిరికాని ప్రయోజనము గలుగలేదని బ్రిటిషు విదేశాంగమంత్రి ప్రకటించెను.

## విషీ.

మాజీ ఫ్రెంచి ప్రధానియగు లావెలుపై రివాల్వరును ప్రేల్చిన కలెట్టి అను యువకునకు ఉరి శిక్ష విధింపబడెను కాని లావెలుగారి మనవివలన, పెటెయిన్ సేనాని సదరు శిక్షను యావజ్జీవకారాగార శిక్షగా మార్చెను.

## ఆక్రమిత ప్రాంతములు.

బొహిమియా యందు అమలు జరుపబడుచున్న ఉరి శిక్షలకు అసమ్మతిని దెలుపుచు, బొహిమియా ప్రభుత్వాధ్యక్షుడగు డాక్టరు హాబాగారు తన పదవికి రాజీనమా నొసగెను. కాని నాజీ అధికారులా రాజీనామాను నిరాకించిరి. జకోస్లావేకియా ఫ్యాక్టరీలలో చాలామంది కార్మికులు సమ్మెల ప్రకటించి జర్మను అధికారుల లక్ష్యపెట్టుట లేదు. ఫ్యాక్టరీలలో పనుల చెడగొట్టినందుల్కుగాను— మరి 14 మంది జెక్కు కమ్యూనిస్టు నాయకులు ఉరిదీయబడిరి.

జెకోస్లావెకియాలో ప్రజలు, అనుకూలమగు తరుణమును జూచుకొని జర్మనులపై తిరుగబడుటకు సిద్ధమగుచున్నారని వార్తలు వచ్చుచున్నవి.

## నౌకా నష్టములు.

బ్రిటిషు నౌకాశాఖకు సంబంధించిన విమానములు ఇంత వరకు 40 శత్రు యుద్ధ నౌకలను 440,000 టన్నుల వర్తక నౌకలను ముంచెను.

4 వ తేదిన బ్రిటిషు నౌక యొకటి అట్లాంటికు సముద్రమున ఒక జర్మను సబ్మెరైను నౌకను ముంచివేసెను.

అట్లాంటికు దక్షిణ ప్రాంతములో ఒక జర్మను నౌకకును అమెరికను నౌకలకును 6 వ తేదిన పోరాటము సంభవించెననియు జర్మను నౌక ముంచివేయబడెననియు తెలియుచున్నది.

ఈ వారము బ్రిటిషు జలాంతర్గాములు, మధ్యధరా సముద్రమున 11 శత్రు నౌకలను ముంచివేసెను. మరి 5 నౌకలకు చాల నష్టము గల్గించెను.

## తటస్థ రాష్ట్రములు.

ఐర్లండు ప్రభుత్వ ప్రధానియగు డివెలరాగారు 5 వ తేదిన ఐరిషు సైనిక విన్యాసముల సందర్భమున ప్రసంగించుచు బ్రిటిషు ప్రభుత్వము ఇంతవరకును ఐర్లండు స్వాతంత్ర్యమును హక్కులను జాగ్రత్తగనే మన్నించెనని ప్రశంసించెను. కొంత మంది బ్రిటిషు ప్రచారకులుగూడ అటులనే గౌరవప్రదమగు మార్గము|ననుసరించిన బాగుండెడిదని అతడనుడివెను.

---

సలహా : ఇకముందు చూచుకొనుటకు యీ మదరాసు యుద్ధ సంచికను మీరు భద్రపరచుకొనుడు.
[మదరాసు సమాచారముల ఆఫీసరుగారు తమ వందనములతో దీనిని మీకు పంపుచున్నారు.]

---

MADRAS: PRINTED BY THE SUPERINTENDENT, GOVERNMENT PRESS.